Museum Series No. 16

109/2-76.

# కొలనుపాక పురావస్తు ప్రదర్శనశాల

Acc. No 14539

ఎస్. రమాకాంతం, M. A., Dip. Museology.
క్యూరేటర్ : ఆర్షశాఖ మ్యూజియం.




సంపాదకులు :

డాక్టరు ఎన్. రామేశన్, M. A., Ph. D., I.A.S., F.R.A.S. (London).
రెవిన్యూబోర్డు సభ్యులు, మరియు రాష్ట్రపురావస్తుశాఖ ప్రదర్శనశాలల డైరెక్టరు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణము
హైదరాబాదు
1976

# విషయసూచిక

# చిత్రముల సూచిక

చిత్రము

# తొలిపలుకు

ఈ కాలములో ప్రదర్శనశాలలు వింత వస్తువులను చారిత్రక అవశేషములను సమీకరించియుంచు గిడ్డంగులు వలెకాక వాటికొక అర్థమునిచ్చి ప్రజలకుపయోగపడు రీతిలో వస్తువులను అమర్చి చూపవలయును. విద్యార్థులకు వారి విద్యావ్యాసంగము లోను, విద్వాంసులకు వారి వారి వ్యాసంగములందు హితోదిక సహాయముచేయు విధముగా మన వస్తుసేకరణ వాని నమర్చు విధానములలో క్రొత్త క్రొత్త పోకడల ననుసరించి సహాయ పడవలయును. ఇవికాక గైడు పుస్తకములు కర పత్రములు, బొమ్మల పోస్టుకార్డులు తయారుచేసి మ్యూజియంను చూడవచ్చిన వారికి పంచిపెట్టుటద్వారా మన మ్యూజియంల గురించి ప్రజా బాహుళ్యములో కొంత ఆసక్తియును శ్రద్ధను, కలిగించవచ్చును. తరచుగా మార్పులు చేర్పులు చేయుటద్వారా, ప్రతి వ్యక్తి అనేక మారులు మ్యూజియంను దర్శించుటకు దోహదము చేయవచ్చును.

కొలనుపాక మ్యూజియంను చూచుటకు అనేక మంది వివిధ తరగతుల వ్యక్తులు వచ్చుచున్నారు. వారందరూ ఇక్కడి స్థలప్రాశస్త్యమును గురించీ, మ్యూజియం నందలి వస్తు నిర్దేశన గురించి ఒక గైడు పుస్తకము బహుధా అవసరమని భావించి కోరినందున, ఈ పుస్తకమును రచించుట కవకాశము కలిగినది.

ఈ పుస్తకమును వ్రాయమని ప్రోత్సహించి, దానిని తయారుచేయునపుడు అనేక సలహాలనిచ్చి చేయూతనిచ్చిన మా డైరక్టర్ శ్రీ ఎన్. రామేశన్, ఎమ్. ఎ., పి. హెచ్. డి., ఐ. ఎ. ఎస్. గారికి సర్వదా కృతజ్ఞుడను.

మా డిప్యూటీ డైరక్టర్ అయిన శ్రీ నారాయణమూర్తిగారికి, అసిస్టెంట్ డైరక్టర్ అయిన కుమారి లలితగారికి వారి సహకారమునకు నా కృతజ్ఞతలు. ఈ తెలుగు సేతను ఆ మూలాగ్రము పరిశీలించి వలయుచో సవరణల గావించి దీనికొక రూపము కలిగించిన మా డిప్యూటీ డైరక్టర్ శ్రీ పరబ్రహ్మశాస్త్రిగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు. నా సహచరులు, మిత్రులైన శ్రీ అవధాని గారికి (గైడ్ లెక్చరర్), శ్రీ జోగినాయుడు (అసిస్టెంట్ క్యూరేటర్) గార్లు ఎంతో సహకరించిరి. వారికి సర్వదా కృతజ్ఞుడను. మా ఛీఫ్ ఫోటోగ్రాఫర్ శ్రీ సుబ్రహ్మణ్యంగారు, ఈ మ్యూజియంకు సంబంధించిన ఫోటోలను సకాలములో అందించినందుకు నా కృతజ్ఞతల నిచ్చుచున్నాను.

ఎస్. రమాకాంతం

4-3-76

# పీఠిక

వివిధములైన వస్తుసముదాయము నొకచోట చేర్చి వాటిని తగురీతిలో పరిశోధించుటకు, చూచి ఆనందించుటకు ఏర్పాటైన ప్రదేశమును వస్తుప్రదర్శన శాల (మ్యూజియం)[1] అని పిలుతురు. ఈ వివిధ వస్తువులు ఒకే ప్రదేశమునకు గాని, వివిధ ప్రదేశములకుగాని చెందియుండవచ్చును. అటులనే ఆ వస్తు సముదాయము ఒకే నాగరికతకుగాని, విభిన్న నాగరికతలకు, అనేక శతాబ్దములకు చెందినవైె కూడ ఉండవచ్చును. కాని మన మేర్పాటు చేయు మ్యూజియం యొక్క ముఖ్యోద్దేశమునుబట్టి వస్తుసేకరణ జరుగుట సమంజసము. పెద్ద మ్యూజియంలు, అనగా రాష్ట్రస్థాయికి, దేశస్థాయికి చెందినటువంటివి, వివిధ రకములైన వస్తువులు, వివిధ నాగరికతలకు, అనేక శతాబ్దములకు చెందినవాటిని సమకూర్చుకొనవచ్చును. కాని కొలనుపాక మ్యూజియంవంటి ప్రాదేశిక లేక స్థానిక మ్యూజియంలు (Site Museums), ఆ ప్రదేశమునకు, లేక కొంత చుట్టు ప్రక్కల ప్రదేశములకు చెందిన వస్తువులను సేకరించి భద్రపరచి ప్రజాబాహుళ్యము నకు అర్థమగు రీతిలో చూపించుటకు ప్రయత్నించుట సమంజసము. కొలనుపాక గ్రామానికి చుట్టుప్రక్కల ఇప్పటికినీ అనేక పురావస్తు శిథిలావశేషములు మనకు కనిపించుచున్నవి. అట్టివానిలో సేకరించిన అనేక శిలావిగ్రహములు, శాసన ముల నొకచోట చేర్చి మ్యూజియంగా నేర్పాటుచేయబడినది.

చారిత్రక యుగమునుండీ కొలనుపాక ప్రఖ్యాతిలోనికి వచ్చినదనుటకు దృష్టాంతములు కలవు. జైన మతానుయాయులకు కొలనుపాక ఒక పవిత్ర యాత్రాస్థలము. ప్రస్తుత మిచ్చట శ్వేతాంబర శాఖకు చెందిన ఒక జైన దేవాలయము నిత్య పూజారాధనలతో విలసిల్లుచున్నది. దీనిని దర్శించుటకు దేశపు నలుమూలలనుంచీ యాత్రికులు ఇప్పటికిని ప్రతినిత్యమూ వచ్చుచున్నారు. ఇదిగాక ఇచ్చట అనేక శైవ మఠములు ఇతర దేవాలయములు కలవు. అందు సోమేశ్వర స్వామి వారి ఆలయ మొకటి. చాళుక్య, కాకతీయ వంశములు ఇచ్చట తమ ప్రాబల్యమును చూపినవి. ఆ కాలమునాటి శిల్పములు, శాసనములు, ఈ గ్రామము చుట్టుపట్ల దొరకినవి. ఆ తరువాతి కాలమునకు చెందిన శిల్పములు కూడా ఇచ్చట కొన్ని దొరకినవి. వీటినన్నింటిని చేర్చి ఈ మ్యూజియంను ఏర్పరచిరి.

---

1. ప్రదర్శనశాల అను పదముకన్నా 'మ్యూజియం' అనుపదము ప్రజాబాహుళ్యమునకు తేలికగా అర్థమగును గాన 'మ్యూజియం' అను పదమునే ఇకమీద వాడుదును.

ఇచ్చట నెలకొనియున్న సోమేశ్వరస్వామివారి దేవాలయ ముఖమంటపమందు ఈ మ్యూజియమును చక్కగా నమర్చియున్నారు.

మ్యూజియమునందు వస్తునిర్దేశన, వాటిని గురించిన విపులవ్యాఖ్య చేయుదురు. అందువలన ప్రతి ఒక్కరికి ఆయా వస్తువులయొక్క లేక కళాఖండములయొక్క ప్రత్యేకతను గుర్తించుటకు వీలగుచున్నది. ఆ విధముగా ఇచ్చటి శిల్పముల నామము, వాటిని ఎచ్చటనుండి సేకరించినది, ఏకాలమునాటివి, మొదలుగా గల విశేషములను విపులీకరించి యున్నందువలన ప్రేక్షకులయందు జిజ్ఞాసను రేకెత్తించును. ఇచ్చట పరిపాలించిన వివిధ రాజవంశములు, అప్పటి శిల్ప కళా రీతులు మొదలుగాగల విషయముల గురించి క్షుణ్ణముగా పరిశీలించు ఆసక్తిని చూపుదురు.

మ్యూజియంనందు ప్రదర్శింపబడు వస్తువులనుగూర్చి తెలుసుకొనుటకును, వాటిపై విపులముగా పరిశోధించుటకును మంచి వాతావరణము, అనుకూల పరిస్థితులు ఏర్పరచవలయును. అప్పుడే ఆ మ్యూజియంను దర్శించు ప్రజల సంఖ్య అధికమగును; ఆ మ్యూజియం యొక్క పేరు పైకి వచ్చును. ఆ విధముగా చూచిన కొలనుపాక మ్యూజియంకు కొన్ని ప్రత్యేక అనుకూల పరిస్థితులు కలవు. ఇది ఇచ్చట సోమేశ్వరస్వామివారి దేవాలయ ముఖమంటపమందు ఏర్పరచినందున కలిగినది. వస్తుతః ఈ దేవాలయము పశ్చిమ చాళుక్యుల కాలమునాటిది. అనగా క్రీ.శ. 11 లేక 12 శతాబ్దమునాటిది. ఆపైన ఈ దేవాలయము ఇప్పటికినీ పూజా పునస్కారముల నందుకొనుచున్నది. అందువలన ఎల్లవేళల దైవదర్శనము నకై ప్రజలు వచ్చుచున్నారు. ఈ దేవాలయ సమీపముననే గల శ్వేతాంబర జైన దేవాలయమునకు దేశపు నలుమూలలనుంచీ యాత్రికులు ఎల్లవేళలా తీర్థప్రజగా వచ్చుచున్నారు. ఆ వచ్చిన వారందరూ సామాన్యముగా సోమేశ్వరస్వామివారి దేవాలయమును, అచ్చట మ్యూజియంను చూచుటకు వచ్చెదరు. పూర్వకాలమున ఇది రాజప్రతినిధి స్థావరము.[1] అందువలన చరిత్రకు సంబంధించిన అనేక విషయములు ఇచ్చట లభ్యమగుచున్నవి. ఆ విషయముల గురించి తెలుసుకొనగోరి చరిత్ర పరిశోధనలు చేయుటకై పరిశోధకులనేకులు వచ్చుచున్నారు. శిల్ప విశేషములను, అందలి ప్రాంతీయ విభేదములను పరీక్షించుటకు ఎక్కువ అవకాశముకలదు. సోమేశ్వర స్వామివారి దేవాలయ శిల్పములు, కుడ్యప్రతిమలతో కలిసిపోయియున్న మ్యూజియం శిల్పములు చూచిన మనకు మిక్కిలి ఆనందము కలుగును.

ఈ అనంత కాల ప్రవంతిలో అనేకమంది మహారాజులు, రాజులు, ధనవంతులు, ఒక్కరననేల ప్రతి ఒక్కరూ, తమకు తోచినంత, తమ అంతస్తుకు తగినటుల ఇక్కడ

1. మనకు తెలిసినంతవరకూ కళ్యాణి చాళుక్యుల కాలము వరకూ ఇది రాజప్రతినిధి స్థావరము. కాకతీయుల కాలమునుంచీ మాత్రమే యిది రాజప్రతినిధి స్థావరముకాదు.

నెలకొనియున్న అనేక దేవాలయములకు, మఠములకు వివిధ కైంకర్యములు చేసినటుల ఇచ్చట అనేక శాసనములు తెలుపుచున్నవి. ఎక్కువ శాసనములవలన ఇచ్చట "అంబిక" దేవాలయమునకు అనేక కైంకర్యములు చేసినటుల తెలియుచున్నది.[1] చాళుక్య, కాకతీయ ప్రభువులు ఈ దేవతకు అనేక కైంకర్యములు చేసిరట. అటులనే ఇచ్చట అనేక శైవ మఠములకు కూడ దానములు చేసిరట. సోమేశ్వర స్వామివారికి ఎనలేని కైంకర్యములు చేసిరి. కొన్ని సుంకములను దానముచేసిరి. క్రీ.శ. 12 శతాబ్ది అంతమునుండి మాత్రమూ జైనమత ప్రాబల్యము చాలవరకు తగ్గిపోయినటుల శాసనాధారములు కనుపించుచున్నవి. బహుశః ఇది శైవమత ప్రాబల్యము వలన కలిగియుండవచ్చును. అంబికదేవాలయ వినాశము గూడా ఈ మత వైషమ్య ఫలితమైయుండవచ్చును.

భారతీయ శిల్పశైలులను గురించి వ్యాఖ్యానించుచూ ఆచార్య రాధాకమల్ ముఖర్జీ పండితుడు ఈ విధముగా చెప్పినాడు: మనదేశమందు కనిపించు శిల్పసంపద యావత్తూ మన భావనా జగత్తుకు, కల్పనా చాతుర్యమునకు గీటురాళ్ళు.[2] యుగ యుగములుగా వచ్చుచున్న వేదాంత సారము గాని, యోగాచారములు గాని ప్రజలలో భారత ప్రజలంతా ఒకటేనని గ్రహింపుకలిగించజాలదు. కాని భారతీయ శిల్ప కళాఖండములను తరచి చూచినకొద్దీ మనకు ఒకటే ఊహ కలుగును. వివిధ శైలులందు ఏకత్వము గోచరించుచుండును. దేశమందలి వివిధప్రాంతములందు విభిన్న శైలులు మొలకెత్తిననూ, వాటికి మూలసూత్రములందు ఏకత్వము, ఒక అవిచ్ఛిన్నత గోచరించును. అందువలననే కావచ్చును వివిధ మతములవారు, వివిధ భాషలను మాటలాడువారు అందరు కూడా ఈ మ్యూజియంను చూచుటకు విచ్చేయుచున్నారు. వీరు అందరూ సోమేశ్వరుని మీది భక్తి తత్పరతతోనే ఇచ్చటికి వచ్చుటలేదు. ఎక్కువమంది ఇచ్చట ఒకచోట చేర్చబడియున్న అనేక శిల్పములను చూచి ఆనందించుటకై కూడ వచ్చుచున్నారు. ఈ విధముగా చూచిన భారతీయులందు గల విభిన్నత్వమందలి ఏకత్వము (సమైక్యతా భావన) కనిపించుచున్నది.[3]

---

1. "అంబిక" జైనుల ఇరువది నాలుగవ తీర్థంకరుడైన మహావీరుని శాసన దేవత. ఈమె మామిడిపళ్ల గుత్తిని చేతియందు ధరించి, తన ఇరువురు కుమారులతోను, సింహము రూపు ధరించిన తనభర్తతో పరివేష్టించియుండును.

2. రాధాకమల్ ముఖర్జీ :- "ఫ్లవరింగ్ ఆఫ్ ఇండియన్ ఆర్ట్."

3. గాంధార శిల్ప సాంప్రదాయము, మధురశైలి, అమరావతి, నాగార్జునకొండ మొదలగునవి చాళుక్య, కాకతీయ శైలులు అన్నీ కొన్ని విభిన్నరీతులను సంతరించుకొన్నను, లోతుగా చూచిన మనకు తెలియునది ఒకటే. వివిధశైలులు వేరు వేరుగాక, ఒకదానినుంచి కొంత గ్రహించి నూతన పోకడలను సంతరించుకొని తమ ప్రతిపత్తిని నిలుపుకొన్నవి అని మాత్రమే.

హిందూ విగ్రహ నిర్మాణము అనేక ఆగమ సూత్రములతో ముడిపడియున్నది. అందువలన మన స్థపతి (విగ్రహ నిర్మాణకర్త) తన శిల్పనాచాతురినంతనూ ఈ ఆగమ సూత్రములకు లోబడియే చేయవలసియున్నది. కనుకనే స్థపతి ప్రతిమాలక్షణములను విస్తృతపరచుటయందు, వాటిని అలంకారముతో శృంగారించుటయందు తన ప్రతిభను ప్రజ్ఞాపాటవమును చూపించినాడు. రేఖా సూత్రములకు ప్రాధాన్యమిచ్చిన మన స్థపతి అవే సూత్రములద్వారా అతి సుందరమూ, సౌకుమార్యము కలిగిన శిల్పములను తయారుచేసినాడు.

మ్యూజియంలద్వారా విజ్ఞాన సముపార్జనచేయుట యనునది ఈ శతాబ్దపు నినాదము. ఈ నినాదము నిజముకావలెనన్న, ప్రతివస్తువునకు దానినిగురించిన పూర్తి విపులీకరణ యుండవలయును. అందు కనుగుణముగా ఈ మ్యూజియంనందు వస్తు వివరణ జరిగియున్నది. ఇదియే ప్రేక్షకునియందు విషయపరిజ్ఞానమునకై ఆసక్తిని దృఢతరముచేయును.

---

# కొలనుపాక – చారిత్రక ప్రాముఖ్యత

కొలనుపాక గ్రామము నల్లగొండ జిల్లాలోని ఆలేరునకు సుమారు 6 కి. మీ. దూరములోనున్నది. ఆలేరు, సికింద్రాబాద్—విజయవాడ రైలుమార్గములో సికింద్రాబాద్‌నకు 60 కి. మీ. దూరములో నున్నది. ఆలేరునుండి రాష్ట్ర రవాణా శాఖ బస్సులు, మరి అనేక యితర సాధనములద్వారా కొలనుపాక చేరవచ్చును.

ఈ గ్రామనామము అనేక రూపాంతరముల చెందినటుల చరిత్ర పరిశోధనల వల్ల తెలియుచున్నది. తాడిమలింగ్ – నరిసిపూర్ తాలూకా మైసూరు నందు దొరికిన రాజేంద్రచోళుని ఒకశాసనములో ఈ గ్రామమును " కొల్లిపాకై " అని పేర్కొనబడెను[1]. ఇది రాజేంద్ర చోళుని పదియవ రాజ్యపాలనా సంవత్సరమున యియ్యబడ్డ శాసనము. సోమేశ్వరస్వామివారి దేవాలయ సమీపమున కల వాగులో ఇసుక మేటయందు దొరికి ప్రస్తుతం రాష్ట్ర ప్రదర్శనశాల, హైదరాబాద్‌నందు భద్రపరచబడిన మూడు పంచలోహపు గంటలలో ఒకదానిమీద కల శాసనము ఈ విధముగా తెలుపుచున్నది[2]:

" స్వస్తి శ్రీమతు కందప్పనాయకరు, కొల్లిపాకేయ సకలేశ్వర సోమేశ్వర దేవరిగె కొట్టిపూజ" కనుక ఇచ్చట కూడా "కొల్లిపాకేయ" యను రూపాంతరమునే వాడినారు. పశ్చిమచాళుక్య వంశపు రాజులు జగదేకమల్లుడు, త్రైలోక్యమల్లుని యొక్క శాసనములు గూడా ఇదే రూపాంతరమును తెలుపుచున్నవి.[3] "కొల్లిపాకేయ యను మాట " కొల్లిపాక " కు కన్నడ భాషాంతరీకరణము. కాకతీయ రుద్ర దేవుని "మెరిపరాల" తెలుగుశాసనములో "కొల్లిపాక" యని మాత్రమే వాడబడి యున్నది.[4] విజయనగర రాజైన సదాశివరాయల కాలమునాటికి ఈ నామము రూపాంతరముచెంది కొల్‌పాక్‌గా మారి ప్రస్తుతము "కూల్‌పాక్" లేక "కొలను పాక" యని పిలువబడుచున్నది[5].

---

1. ఎపిగ్రాఫియా కర్ణాటికా : వాల్యూం III : పుట 34
2. లలితకళా వాల్యూం నంబరు 10 ; పుటలు 25-30.
3. ఎపిగ్రాఫియా ఇండికా : వాల్యూం నంబరు ; III, పుట 230.
   ఎపిగ్రాఫియా ఇండికా : వాల్యూం నంబరు : IV, పుట 323.
4. హైదారాబాద్ ఆర్కలాజికల్ సీరీస్ నంబరు: 19., పుట 147.
5. ఎఫ్. కీల్ హారన్ : బ్రిటిష్ మ్యూజియం ప్లేట్స్ ఆఫ్ సదాశివరాయ ; శక సంవత్ 1478 క్రీ.శ. 1556; ఎపిగ్రాఫికా ఇండికా ; వాల్యూం IV, పుట 22.

క్రీస్తుశకము పదునొకొండవ శతాబ్దినాటికి ఈ గ్రామము ఒక ప్రసిద్ధ జైన యాత్రాస్థలముగాను, ఎల్లోరా, పటన్‌చెరువు, కొప్బాల్ మొదలైన జైనమహా పుణ్యక్షేత్రములతో సమాన స్థాయిలో నుండినటుల గోచరించుచున్నది. కొంత కాలము క్రితమె ఒక శ్వేతాంబర జైనదేవాలయము పునరుద్ధరింపబడి పూజలు మొదలుపెట్టబడెను.

సోమేశ్వరస్వామివారి ఆలయమునకు పశ్చిమముముగా ఉన్న ఒక ఊబదిబ్బ మీదనున్న ఒక శిలాస్తంభముమీద ఒక శాసనము కలదు, ఇది బహుశః మానస్తంభము గాని, కీర్తిస్తంభముగాని అయియుండవచ్చును. ఇది పశ్చిమచాళుక్యవంశజుడైన త్రిభువనమల్ల ఆరవ విక్రమాదిత్యుని నాటిది. అతని పుత్రుడగు కుమార సోమేశ్వరుని పరముగా చెక్కబడియున్నది. ఈ స్తంభమునకు నాలుగుప్రక్కల శాసనములు కలవు. ఇందు సోమేశ్వరుడు పానుపుర గ్రామమును, కొలనుపాకయందు కల "అంబిక" యను జైనదేవతకు కానుకగా ఇచ్చినటుల ఇందు తెలుపబడెను. అటులనే ప్రెగ్గడ కేశిరాజు అను చాళుక్య ప్రభువు యొక్క దేవాదాయ, ధర్మాదాయ శాఖాధికారి అంబిక దేవాలయములో ఈ జయస్తంభమును, తన చక్రవర్తి త్రిభువనమల్లుని పేర చెక్కించి పెట్టియుండునోపు. ప్రెగ్గడ కేశిరాజు జైనభక్తుడు.

షడక్షరునిచే వ్రాయబడిన రాజశేఖర విలాసమునందు కొల్లిపాక శైవమతాచార్యుడైన రేణుకాచార్యునియొక్క జన్మస్థలముగా పేర్కొనబడినది. ఈ గ్రంథము ననుసరించి, రేణుకాచార్యులు జైనమత ప్రవక్తలలో ముఖ్యుడనియూ, అయోనిజుడనియు, ఇచ్చట స్వయంభులింగమైన సోమేశ్వరుని నుంచిఉద్భవించి, చివరకు మరల అదే లింగములోన సిద్ధిపొందిరట. వీరు చాలాకాలము వీరశైవ మతఉద్ధరణకై పాటుపడిరి. షడక్షరుల వారు చెప్పుటలో, తేనుకేశుడను శైవాచార్యునకు రుద్రమునీశ్వరుడను కుమారుడు కలిగెనని, తేనుకేశులవారు, తమ యనంతరము రుద్రమునీశ్వరుని లింగాయత మఠమున కధిపతిని చేసెనని వ్రాసినారు. తేనుకేశుడు లింగాయతమఠ మందలి అయిదుమంది ముఖ్యగురువులలో ఒకరు. ఆయన కొలనుపాకలో ఒక లింగాయత మఠమును స్థాపించి దానికే తనకుమారుని మఠాధిపతిగా నియమించెనట. ఇదంతా చెప్పి షడక్షరులవారు తానుగూడా ఈలింగాయతమఠాధిపతుల వంశములోని చిక్కవీరదేవునికి బంధువునని తెలుపుకొన్నాడు. ఈ చిక్కవీర దేవుడు రుద్రమునీశ్వరవంశవృక్షములోని ఉద్ధన, గండబీశ్వర, అన్నదనీశ, రేవణ సిద్ధి మొదలుగాగల వారి సమవర్తినని తెలుపుచున్నాడు.

వీరశైవాగమము ననుసరించి రేణుకాచార్యుడు మరెవరో కాదు, రేవణ సిద్ధయ యనియూ, ఇతనే అగస్త్యమహామునికి సిద్ధాంతశిఖామణి యందు పొందు పరచిన స్థలస్థల సిద్ధాంతమును గూర్చి తెలియపరచెనని కూడ ప్రతీతి కలదు. ఇందు

వలన మధ్యయుగమునకు పూర్వమే కొలనుపాక ఒక మహా శైవ పుణ్యక్షేత్రముగా భాసిల్లినదని తెలియవచ్చుచున్నది.

మధ్యయుగమున కొలనుపాక దుర్భేద్యమైన కోటగా భాసిల్లినది. అయిదవ విక్రమాదిత్యుని కాలమునాటికి (క్రీ.శ. 1008-1015) యిది ఒక పెద్దకోట. రాజేంద్ర చోళుని మూడవ రాజ్యపాలనా సంవత్సరమునకు చెందిన ఒక దానశాసనములో అతను కొలనుపాక పట్టణమును పట్టుకొనినటుల తెలియుచున్నది. అంతకు పూర్వపు శాసనములు ఈ విషయమై ప్రస్తావనచేయసందున రాజేంద్రచోళుడీ పట్టణమును క్రీ.శ. 1013-1014 లో పట్టుకొని యుండవచ్చును. ఇతను అయిదవ విక్రమాదిత్యుని జయించి ఈ కోట స్వాధీనపరచుకొని యుండవచ్చును. ఆ కారణమువల్ల రెండవ జయసింహుడు (పశ్చిమచాళుక్య ప్రభువు) క్రీ.శ.1015న రాజ్యమునకు వచ్చి, రాజేంద్ర చోళునితో అనేక మారులు యుద్ధ మొనరించిననూ, కొలనుపాక యొక్క ప్రతిపత్తి ఏమాత్రము మారినటులలేదు. మొదటి జగదేకమల్లుని కాలమునకు (క్రీ.శ. 1033) చెందిన ఒక శాసనములో కొల్లిపాకను "మన్నె కలిమయ్య" అను దేవున కంకిత మొనరించినటుల తెలిపియున్నది గాన చోళరాజు ఈ నగరమును తాత్కాలిక ముగ జయించినను ఇది చాళుక్యరాజుల క్రిందనే యుండెను.

మొదటి జగదేకమల్లుని తరువాత మొదటి సోమేశ్వరుడు రాజ్యమునకు వచ్చెను. ఇతనికి ఆహవమల్లుడను బిరుదు కూడ కలదు. ఇతని కాలములో అనగా క్రీ.శ. 1042 లో కుమార విక్రమాదిత్యుడు (తరువాతి ఆరవ విక్రమాదిత్య మహారాజు) మొదటి రాజాధిరాజు (చోళప్రభువు) మీదికి యుద్ధమునకు వెళ్ళి దన్నడ యను చోట ఓడిపోగా, రాజాధిరాజు చాళుక్య రాజ్యములో ప్రవేశించి కొలనుపాక వరకూ వచ్చి, దానిని దగ్ధము చేసినటుల శాసనములు తెలుపుచున్నవి. రెండవ సోమేశ్వరుడు క్రీ.శ. 1068 లో రాజ్యమునకు వచ్చి క్రీ.శ. 1078 వరకు రాజ్యపాలన సాగించెను. ఈ పదిసంవత్సరములలోనూ, కొలనుపాకకు సంబంధించినంతవరకూ ఎలాటి ముఖ్య సంఘటనలూ జరుగలేదు. ఆ తరువాత క్రీ.శ. 1076 లో ఆరవ విక్రమాదిత్యుడు రాజ్యమునకు వచ్చి సుమారు అర్ధశతాబ్దము రాజ్యము చేసెను. ఈ సమయములో కొలనుపాక సుఖశాంతులతో తులతూగినది.

ఆరవ విక్రమాదిత్యుని కాలమునకు చెందిన ఆరు శాసనములు కొలనుపాక యందు కలవు. అన్నింటికన్నా పురాతనమైనది క్రీ.శ. 1088 నాటిది. ఇందులో తొండరస చోళమహారాజు కొలనుపాకరాజ్యమునకు మహామండలేశ్వరుడుగా యుండినటుల తెలియుచున్నది. అతను ఇచ్చట పరివేష్టించియున్న ఉత్తరేశ్వరునకు కొంత భూమిని ధానముగా నిచ్చినటుల తెలుపుచున్నది. రామేశ్వర పండితుడను వాడు కొలనుపాక వాస్తవ్యుడు. ఉత్తరేశ్వరుని గుడి యజమానిగా ఆ దానమును

గ్రహించినట్లు తెలిపియున్నది. ఆ తరువాత క్రీ.శ. 1097 నకు చెందిన శాసనములో కొలనుపాక స్వయంభూ సోమేశ్వరులవారికి ఒక గ్రామము సర్వభుక్తముగా దానము చేయబడినటుల తెలుపుచున్నది. మరొక శాసనములో తొండయ్య చోళదేవ మహారాజను నతను కొలనుపాకకు మహామండలేశ్వరుడుగా ఉండినటుల తెలుపబడెను. ఇతను ఇచ్చటనున్న విష్ణుదేవాలయమునకు కొన్ని దానములు చేసినటుల తెలుపుచున్నది.

మరియొకశాసనము చాళుక్య విక్రమశకము 29కి అనగా క్రీ. శ. 1104 నాటిది. ఇందులో పారమార వంశజుడు జగద్దేవుడనువాడు కొలనుపాక రాష్ట్రము నకు మహామండలేశ్వరుడై యుండగా మహారాజుకు సేనాపతి, సంధివిగ్రహి అయిన సోమలదండనాయకుడు రాజ్యపురోభివృద్ధికి, శాంతి సౌభాగ్యములకొరకై ఒక జగద్దేవనారాయణస్వామి వారి ఆలయము రాష్ట్రముఖ్యపట్టణమైన కొలనుపాక యందు నిర్మించినాడట. తరువాత చాళుక్య విక్రమశకము 31 అనగా క్రీ.శ.1107 కు చెందిన దానిలో అనంతపాల దండనాయకుడు కొన్ని సుంకముల ద్వారా వచ్చు ధనమును కొలనుపాకయందలి జగద్దేవనారాయణస్వామి వారి కైంకర్యమునకై దానముచేసినటుల తెలియుచున్నది. ఇక ఆఖరి శాసనము క్రీ. శ. 1125 నాటికి చెంది నది. ఇందు మహామండలేశ్వర చాళుక్య గాంగపెరమాది కుమార సోమేశ్వరుడు, కొలనుపాక దండనాయకుని కోరినమేరకు అచ్చట అంబిక యను దేవతకు కొంత దానము చేసినాడట. నల్లగొండ జిల్లా గూడూరు గ్రామమునందు దొరికిన ఒక శాస నములో స్వామిపయ్య యనువాడు, కుమార సోమేశ్వరుని దండనాయకుడు కొలనుపాక రాష్ట్రమున కధిపతిగా ఉండినటుల తెలుపుచున్నది.[1]

ఆరవ విక్రమాదిత్యుని తరువాత మూడవ సోమేశ్వరుడు, ఆ తరువాత రెండవ జగదేకమల్లుడు రాజ్యమునకు వచ్చిరి. ఇతని కాలపు శాసనము కొలనుపాకయందు దొరకినది. ఇందు దుర్గ సంరక్షణాధికారి మనెవెర్గడె నన్నపయ్య యనువాడు సోమేశ్వరస్వామివారికి (స్వయంభూ సోమేశ్వరస్వామి) కొంత భూమిని దానముగా ఇచ్చినాడట.[2]

కళ్యాణి చాళుక్యవంశము క్షీణించినతరువాత వారిక్రింద సామంతులుగా నుండిన కాకతీయ ప్రభువుల పాలనలోనికి కొలనుపాక వచ్చినది. కాకతీయ రుద్ర దేవుని శాసనము, మొరిపరాలలోనిది. క్రీ.శ. 1181 రుద్రమాంబ శాసనము వలన, కొలనుపాక తన పూర్వపు ఔన్నత్యమును పోగొట్టుకొనినట్లు తెలియుచున్నది. కాక తీయ రాజ్య ముఖ్యపట్టణమైన ఓరుగల్లు; ఇచ్చటికి చాలా సమీపములో నుండినందున

1. చాళుక్యకుమార సోమేశ్వరుని ప్రశస్తి.
2. సోమేశ్వరస్వామి దేవాలయమునకు చేసిన భూదాన శాసనము.

బహుశః వారు దీనిని ఒక రాష్ట్రముగాగాని, రాష్ట్ర ముఖ్యపట్టణముగాగాని యుంచియుండలేదు. కాని అప్పటికిని దీనిని అనేక ముఖ్యపట్టణములలో ఒకటిగా గుర్తించియుండిరి. కాకతీయ ప్రతాపరుద్రుని కాలమునాటి శాసనము ఒకటి ఇచ్చట దొరకినది. ఇందులో కాకతీయ ప్రతాపరుద్రుని క్రింది ఉద్యోగి రాష్ట్రకూట వంశజుడు, ఇచ్చట స్వయంభు మాణిక్యతీర్థేశ్వరస్వామి వారి త్రికాల ధూపదీప నైవేద్యములకై కొంత భూమిని దానముచేసినటుల తెలియుచున్నది.[1] కొలనుపాక ప్రభుత్వ పరంగా తనయాధిక్యతను కోల్పోయిననూ, ఇది ఒక ప్రధానపట్టణము గాను, మతపరముగాను పెద్ద పుణ్యతీర్థంగానూ ఉండినది. అందుకు నిదర్శనంగా, సోమేశ్వరస్వామివారి దేవళ గడపల మీదకల తరువాతి కాలంనాటి చిత్రముల వల్ల తెలియుచున్నది.[2] అదేగాక ఇప్పటికిని ఈ గ్రామము సిరిసంపదలతో తుల తూగుచుండుట మరొక ముఖ్య నిదర్శనము.

---

1. ప్రతాపరుద్రుని శాసనము ; సంస్కృతము : రిపోర్ట్ ఆన్ ఎపిగ్రఫీ (ఆంధ్ర ప్రదేశ్) 1965 : పేజి. 62 : శాసనము : 266.

2. విజయనగరము, తరువాతి కాలపునాటి చిత్రములు కొన్ని ఇప్పటికిని మనకు కనిపించుచున్నవి.

**1. ద్వారబంధము :**— ద్వారబంధమున కిరువైపుల చెక్కడపు పనికలదు.

(ఏ) ***గజలక్ష్మి :***— ద్వారబంధమున కొకవైపున గజలక్ష్మి చెక్కబడి యున్నది. లక్ష్మీదేవి పద్మాసనాసీన అయి రెండు చేతులందు పద్మములను ధరించి యున్నది. అవి ఆమె భుజములవరకూ వచ్చియున్నవి. వజ్ర, వైడూర్యములు చెక్కిన బంగారు ఆభరణ ములను ధరించియున్నది. చెవులకు మకరకుండలములు కలవు. దేవి కిరీట మకుటధారిణి. రెండు ఏనుగులు ఇరువైపులనుంచి పుణ్యజలమును లక్ష్మీదేవి శిరస్సున అభిషేకించుచున్నవి. శిల్పశైలి దృష్ట్యా యిది. క్రీ.శ. 11 శతాబ్దమునకు చెందియుండవచ్చును.

(బి) ***దక్షిణామూర్తి :***— ద్వారబంధము రెండవవైపున దక్షిణామూర్తి రూపము చెక్కబడియున్నది. దక్షిణామూర్తి పద్మాసనముమీద వీరాసనములో కూర్చొని, ఒక కాలు అపస్మార పురుషుని వీపు మీద వేసియున్నాడు. ఇతను త్రినేత్రుడు. చతుర్భుజుడు. చేతులలో జ్ఞానముద్ర - వరదముద్ర — దండము - అక్షమాల కలిగియున్నాడు. జటామకుటధారి. యజ్ఞోపవీతము, చెవులకు శంఖపత్రమును ధరించెను. మెడయందు రుద్రాక్షమాల కలదు. సప్తఋషులు ఇతనిని పూజించుచున్నారు. దక్షిణామూర్తి ఆత్మయోగమును గూర్చి, సంసార బంధములనుంచి విముక్తి గురించి ఋషులకు బోధచేయునట. అతను ఆసీనుడైయున్న పద్మాసనము, అతిపవిత్రమైన " ఓం " కారమునకు నిదర్శనమట. శిల్ప శైలి దృష్ట్యా ఇది క్రీ.శ. 11 శతాబ్దమునకు చెందినది.

**2. కోష్ఠపంజరము:**— ఈ శిల్పము ఉబ్బెత్తు ప్రతిమ (Relief figure). ఇది దేవాలయ శిఖరమువలె మూడుఅంతస్తులతో చెక్కబడియున్నది. మొదటి అంతస్తు నందు మామూలుగా కనిపించవలసిన దేవాతా ప్రతిమలు (మూర్తులు) కనిపించుట లేదు. స్థల నిర్దేశము మాత్రము కలదు. శైలిదృష్ట్యా క్రీ. శ. 10 లేక 11 శతాబ్ద మునకు చెందినది.

**3. పార్శ్వనాథుడు:**— ఇతను ఇరువది మూడవ జైన తీర్థంకరుడు. కాయోత్సర్గస్థితియందున్నాడు (ఎలాటివంపులు లేక నిటారుగా నిలుచొని యుండు

స్థితి). మోకాలు క్రింది భాగము, తీర్థంకరుని శిరస్సునకు ఆచ్ఛాదనగా కల పాముపడగలు విరిగిపోయియున్నవి. ఉంగరములు చుట్టుకొని, అప్పుడే చక్కగా దువ్వినటులున్న తలవెంట్రుకలు కలవు. చక్కని మెరుపుగలదు. ఈ విగ్రహము కూడ క్రీ.శ. 10 శతాబ్దమునకు చెందినది.

*4. ధ్వజ స్తంభము :*—ఇది సోమేశ్వరస్వామివారి ధ్వజస్తంభము. క్రీ.శ. 15 శతాబ్దమునకు చెందిన తెలుగు శాసనమొకటి దీనిమీద కలదు. దానిలో ఇది ఒక జయస్తంభమని, "రెసబరలగనె————" కుమారుడైన యల్లప్ప స్థాపించినటుల తెలియుచున్నది.

*5. గణపతి:*—దేవాలయ ద్వారముదగ్గర, ఇరువైపుల గణపతి విగ్రహములు కలవు. వీనికి ఎలాటి కిరీటములు లేక, చెవులు కొంచెము చిన్నవిగ, ఉన్నవి. గణపతి చతుర్ భుజుడు. ఎడమ చేతియందు కల మోదకములను భక్షించుచున్నాడు. నాగఉదరబంధము కలదు. ఇవి బహుశః పురాతనమై క్రీ.శ. 11–12 శతాబ్దమునకు చెందియుండనోపు. (చిత్రము - 2)

*6. ఆంజనేయుడు:*—పైన చెప్పిన ధ్వజస్తంభమునకు ముందుగా ఈ విగ్రహము కలదు. కుడిచేతియందు గద. ఎడమ చేయి చిన్ ముద్రను ధరించియున్నవి.

*7. రాతిఫలకము:*—చతురస్రాకారములో కల రాతిఫలకమిది. దీని మధ్య ఒక దేవతా విగ్రహము నిలుచుని యున్నటులున్నది. నాలుగు చేతులు కల ఈ దేవత పై రెండు చేతులందూ సర్పము, త్రిశూలము ధరించి యున్నాడు. మిగిలిన కుడిచేతియందు గద, ఎడమ చేయి కట్యావలంబితమై కలదు. అతను కంకణములు, కేయూరములు, యజ్ఞోపవీతము కలిగియున్నాడు. పెద్ద కుండలములు చెవులకు కలవు. ఇది బహుశః అంత ప్రాచీన శిల్పముకాదు.

*8. నటరాజు:*— శివస్వరూపము : భుజంగత్రాస నృత్యము సల్పుచున్న నటరాజ విగ్రహమిది.[1] కొంచెముగా వంగిన కుడికాలు అపస్మార పురుషుని వీపు మీద మోపి, ఎడమకాలు కొంచెము పైకెత్తినటుల చూపబడినది. నటరాజస్వామికి పదిచేతులు. అందు ముందరి రెండు చేతులు నాట్యరీతియందుకలవు. మొదటి ఎడమ చేయి దండహస్తము[2] (లేక గజ హస్తము) నందుకలదు. కుడిచేయి అభయ

---

1. అపస్మారపురుషుని మీద మోపిన కుడికాలి మోకాలి కన్నా పైకెత్తిన ఎడమ కాలుయున్న భుజంగలలితమనియు, మోకాలికన్నా క్రిందికియున్న భుజంగత్రాస నృత్యమనియు నందురు. ఇవి రెండు తాండవ మండలి రీతులు.

2. ఎడమ చేయి శరీరము మధ్యగా, సమాంతరముగా కుడివైపుకువచ్చి, హస్తము మణికట్టు దగ్గరనుంచి వంగియుండుట.

హస్తమునందుండి మణికట్టుదగ్గర సర్పవలయములు కలవు. కుడివైపునుండి వర్తులాకారముగా త్రిశూలము, పాశము, డమరుకము, ఖడ్గము (పరశు). డాలు, చక్రము, సర్పము చేతులందు ధరించియున్నాడు. కేశములు జటామకుటముగా ముడిచి దుర్దర పుష్పాలంకృతమై యున్నవి. యజ్ఞోపవీతము, ఉరుసూత్రము కూడకలవు. చేతి వ్రేళ్ళకు ఉంగరములు, కాలి వ్రేళ్ళకు మట్టెలు ధరించియున్నాడు. చాళుక్య శైలిలో సర్వాభరణాలంకృతుడై యున్నాడు. ఇది ఉబ్బెత్తు విగ్రహము (Bass Relief). తెల్లబండరాయి యందు చెక్కబడినది. బహుశః క్రీ.శ. 11 శతాబ్దమునకు చెంది యుండును. (చిత్రము - 3)

*9. మహిష మర్దని:*— అమ్మవారు నాలుగు చేతులు కలిగి ఎడమచేతులందు శంఖము, మహిషముయొక్క తోక, కుడిచేతులందు ఖడ్గము, చక్రము ధరించియున్నది. శిల్పచాతుర్యమంత పురాతనముగా కనుపించదు. దేవి కంకణ కేయూరములు, మేఖలము, వదులుగా యున్న మొలనూలు, అనేక హారములు, కుండలములు ధరించియున్నది. అమ్మవారి తలదగ్గరి ప్రభామండలము అండాకారముగా కలదు. ఈమె కరండ మకుటధారిణి. కాని ఈ మకుటము హ్రస్వముగా కనిపించుచున్నది. అమ్మవారు కాశె బిగించి వస్త్రము ధరించియున్నది. క్రీ.శ. 12 శతాబ్దము.

*10. వీరకలు :*— ఒక శిలాఫలకములో కల విగ్రహమిది. కాని ఫలకము ఎక్కువభాగము విరిగిపోయినందున ప్రస్తుతము బాగా అలంకరించిన ఏనుగు మాత్రము కలదు. దానిమీద యుండిన వీరుడు, మిగతా వివరణ విరిగిపోయినది.

*11. యాళి విగ్రహము:*—ఈ జంతువు అతిభయంకరముగా కనుపట్టుచున్నది. కళ్లు మిడిగుడ్లు; గాండ్రింపునోరు; చిన్నవైన చెవులు; నిక్కబొడిచి వంచినతోక; ఈ మృగము మీదికి దూకగలదన్న భ్రాంతిని కలిగించుచున్నది.

*12. దంపతులు:*—రాతిఫలకము మీద మలచిన ఉబ్బెత్తు విగ్రహము: ఒక దంపతుల జంట బాగా అలంకరించిన ఒక ఏనుగు మీద ఎక్కిపోవుట సూచించినది. గొడుగువంటి ఆచ్ఛాదన వారి శిరస్సునకు కలదు. మగవాని చేతియందు ఖడ్గము కలదు. ఇరువురి వదనములు రూపుచెడియున్నవి. ఆతని శిరస్సున శిఖ, ఆమెకు ధమ్మిల్లము కలవు. (చిత్రము - 4)

*13. చామర గ్రాహిణి :*— ఈ స్త్రీమూర్తి చాలా సొగసైన త్రిభంగిమ రీతిలో నిల్చొని యున్నది. ఈమె ముఖలక్షణములు, నిలుచున్న భంగిమ అజంతా చిత్తరువులందలి స్త్రీ మూర్తులను పోలియున్నది. క్రీ.శ. 10-11 శతాబ్దము.

*14.* నాగిని:—దీర్ఘచతురస్రాకారపు ఫలకముపై ఒక నాగినిమూర్తి నిక్షిప్తమైయున్నది. అనేక ఆభరణములు ధరించిన నాగినికి ఒక పొడవాటి హారము స్తనముల మధ్యనుంచి వ్రేలాడుచున్నది. ఆమె కత్తి, డాలు ధరించియున్నది. మూడు తలల నాగేంద్రుడు ఆమె శిరస్సున కాచ్ఛాదన కలిగించుచున్నాడు. దీని వల్లనే ఈ మూర్తి నాగినియని మనము గ్రహించవలయును.

*15.* భైరవుడు:—భైరవుడు దిగంబరుడు.[1] చతుర్భుజుడు. అందు ఖడ్గము – త్రిశూలము ... (పాశము ?) కపాలము కలిగియున్నాడు. కపాలమాల, రెండు కోరలతో భయానకముగా ఉన్నాడు. ఇది క్రీ.శ. 12 శతాబ్దమునకు చెందినది.

*16.* మహిషమర్దని:—మహిషాసురుని కాలితో త్రొక్కిపెట్టినట్లు త్రిభంగ మందు మలచిన పవిత్ర మూర్తి ఇది. ఆగమ సూత్రములకు నిర్వచన మన దగిన ఈ మూర్తి అతి సుందరముగానున్నది. మౌక్తికధారిణి. సన్నగా, తీర్చిదిద్ది నటుల కనిపించుచున్న ఈ మూర్తికి, ఆభరణ సంపద కొంత ఎక్కువగా ఉన్నటుల కనిపించుచున్నది. ఈ శిల్పము బాగుగా నునుపుచేయబడి యున్నది. కాని కొన్ని పెచ్చులు లేచిపోయెను. ఈమెకు ఎనిమిది చేతులు. అందు కుడిచేతులందు బాణము, డాలు మూడవ చేయి విరిగియున్నది. ఎడమ చేతులందు కత్తి, విల్లు, త్రిశూలము ధరించి, మిగిలిన రెండు చేతులందు మహిషుని పట్టుకొనియున్నది. మహిషము తల తెగిపోగా, రాక్షసుడు మానవాకారముతో బయటికి వచ్చుచూ అంజలి ఘటించుచున్నాడు. సుకుమారముగా కనుపించు అమ్మవారి తనూలత మీద, బరువైన కరండమకుటము ఆకర్షణీయముగా నుండక, అసహజముగా నున్నట్లు కనుపించును. వనమాల, మణిమయ మేఖలము, కంఠహారము, వివిధహారములు కంకణములు, కేయూరములు, కుండలములు ధరించి దుర్గాదేవి నిండుగా కనిపించు చున్నది. చాళుక్య శిల్పము. క్రీ.శ. 12 శతాబ్దము (చిత్రము – 5)

*17.* చాముండ:—చాముండ సప్త మాతృకలలో ఒకటి. ఇది ఒకింత పెద్ద విగ్రహము. చతుర్భుజ. నాలుగు చేతులందు ఖడ్గము, త్రిశూలము, డమరుకము, కపాలము, ధరించియున్నది. పద్మాసనాసీనమైయున్న ఈమె ఎముకల గూడుగా నుండును. పొట్ట వెన్నుకతుక్కొని, పళ్ళికిలించి, వ్రేళ్ళాడు స్తనములతో నిడువైన చెవులు, పెద్ద చెవితొట్లు, చింకిరిజుట్టు, కపాల ముఖపట్ట ధరించి భయము గొల్పు చున్నది. వెడల్పైన కంఠహారము, నాగకేయూరములు, సర్ప కుండలములు, నాగ కుచబంధము ఆభరణములుగా కలిగి విలక్షణముగా ఉన్నది. క్రీ.శ. 10 శతాబ్దము.

1. ఈ రూపమును చేయుటయందు ఉత్తర దక్షిణభారత దేశములకు వ్యత్యాసము కలదు. ఉత్తరభారతమునందు పాదరక్షలు (పాదుకలు) చూపుదురు. దాక్షిణాత్యశిల్ప ములందు అవి సామాన్యముగా ఉండవు.

*18.* మహిషాసురమర్దని:-దుర్గాదేవి మహిషాసురుని తల నరకగా, కారెనుము మొండెమునుంచి మానవాకారముతో రాక్షసుడు అంజలి ఘటించి వచ్చుచున్నాడు. విగ్రహము బాగాపాడైయున్నది. చాళుక్య శిల్పము: క్రీ.శ. 11-12 శతాబ్దము.

*19.* వీరకల్లు:—దీర్ఘచతురస్రాకారపు రాతిపలకమీద ఏనుగు నెక్కి పోవు వీరుని చెక్కియున్నారు. దీనికిరువైపుల రెండు స్తంభములు చెక్కబడియున్నవి. వాటి మీదనుంచి వచ్చియున్న తోరణము మధ్యలో శిల్పము నిక్షిప్తమై యున్నటు లున్నది. తోరణమువల్ల శిల్పమునకు ఒక వినూత్నశోభ కలిగియున్నది. ఏనుగు బాగా అలంకరింపబడియున్నది వీరుని ముఖము, చేతులు రూపుచెడి యున్నవి. వీరుని చేతియందు ఖడ్గము కలదు. కేశములు శిఖగా నేర్పడియున్నవి. శిల్పము అడుగు పీఠముమీద క్రీ.శ. 13 లేక 14 శతాబ్దమునకు చెందిన శాసనము కలదు. అందులో "లెంక అన్నయ్య"అని మాత్రము చదువ వీలుగానున్నది, మిగిలిన అక్షరములు బాగా చెరిగి పోయియున్నవి. ఈ అన్నయ లెంక కాకతీయ ప్రతాపరుద్రుని సేనానులలో నొకడు. రాయగజ సాహిణి, మాదాయ రెడ్డికి తమ్ముడు గావచ్చును. ఇతడు ముసల్మానుదండు నెదుర్కొనుచు వీరమరణమునొందెను, క్రీ.శ.14 శతాబ్దము.

*20.* సప్తమాతృకలు:— ఒకే భద్రపీఠముమీద సుఖాసీనులుగా మల చిన శిల్పమిది. పెద్దపరిమాణములో శిల్పలక్షణములతో నున్నదీ శిల్పము. ఇరుపార్శ్వములందు గణపతి వీరభద్రులు చెక్కబడి మధ్య సప్తమాతృకలు చెక్కబడియున్నది. అంధకాసురుడను రాక్షసుడు అవిక్ర పరాక్రమముతో, అజేయుడై ప్రపంచము నంతట భయభ్రాంతులు గొల్పుచుండగా పరమశివుడు దేవతలందరి శక్తుల యొక్క అంశములతో సప్తమాతృకలను సృష్టించి, అతని పీడను ప్రపంచమునకు లేకుండ చేసినాడట. ఇందు బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండ; ఇవి కాక యోగేశ్వరి కూడా కలదని ఒక వాదన కలదు. ఆమెతో కలిపి ఎనిమిదిమంది కాగలరు. కాని సప్తమాతృకలు ఏడుగురు మాత్రమే యుండవలయును, (సప్త = ఏడు), ఒక్క వరాహ పురాణము తప్ప మిగిలినవన్నీ ఏడుగురినిమాత్రమే తెలుపుచున్నవి.[1] సప్తమాతృకలు క్రింది విధముగా చూపబడినవి:

---

1. వరాహ పురాణములో యోగేశ్వరి ఎనిమిదవ దేవి. ఈ పురాణమును బట్టి ఎనిమిది మాతృకలు, ఎనిమిది మానసికస్థితులను సూచించునని తెలుపుచున్నది. అందు యోగేశ్వరి కామము ; మహేశ్వరి క్రోధము : వైష్ణవి లోభము, బ్రాహ్మి, మదము; కౌమారి ; మోహము; ఇంద్రాణి మాత్సర్యము; యమి లేక చాముండ శూన్యము లేక అబద్ధప్రచారము: వారాహి అసూయను సూచించును. ఇదిగాక అంధకాసురుడనగా అవిద్య. దీనిని శివునిచే అనగా ఆత్మవిద్యచే నిర్మూలించుట యని కూడా సూచనకలదు.

*వీరభద్రుడు:*—ఈ ఫలకమందు మొదట వీరభద్రుడుండును. ఇతనిని వీణాధరశివుడని పిలుచుట కూడా కలదు. ఇతను త్రిశూలము, రుద్రాక్షమాల ధరించి మరి రెండు చేతులతో వీణవాయించుచున్నాడు. దండకడియములు, మురుగులు, కర్ణాభరణములు, ముత్యాలహారములు, మేఖలము, ధరించియున్నాడు. కేశములు జటాజూటముగా నేర్పడియున్నవి.

ఎ. *బ్రాహ్మి:*—ఈ దేవి చతుర్భుజ. అందు కలశము, పండు, పాశము, అభయముద్ర కలవు. కంకణ కేయూరములు, కర్ణాభరణములు, నిడుపైన కంఠహారములు, మేఖలము ధరించియున్నది. కరండమకుట ధారిణి: దేవి పాదములవద్ద వాహనమైన హంస కలదు.

బి. *మాహేశ్వరి:*—ఈమెకూడా చతుర్భుజ. త్రిశూలము, ఫలము, డమరుకము, అభయముద్ర కలిగియున్నది. పైన దేవికి చెప్పిన అన్ని ఆభరణములనూ ధరించి యున్నది. వాహనమైన నంది పీఠము మీద చెక్కియున్నది.

సి, *కౌమారి:*—ఈ దేవి చతుర్భుజ. అందు శక్తి, ఫలము, వజ్రము, అభయముద్ర కలిగియున్నది. ఈమె వాహనమైన నెమలి పీఠము మీద చెక్కియున్నది. సర్వాభరణములను ధరించియున్నది.

డి. *వైష్ణవి:*—ఈమె చతుర్భుజ. అందు శంఖము, ఫలము, చక్రము, అభయముద్ర ధరించియున్నది. గరుత్మంతుడు ఆళీఢాసనాసీనుడై పీఠముమీద చూపబడెను.

ఇ. *వారాహి:*—చతుర్భుజ. అందు ఫలము, కలశము, అభయము కలిగి, నాలుగవ చేయియందలి రూపము బాగుగాలేదు. కరండ మకుట ధారిణి. వరాహ (పంది) ముఖము కలది. మహిష వాహనము కలదు.

ఎఫ్. *ఇంద్రాణి:*—చతుర్భుజ. ఆమె అంకుశము, ఫలము, వజ్రము, అభయముద్ర చేతులందు కలిగియున్నది. ఐరావతము (ఏనుగు) వాహనము, పీఠముమీద చెక్కియున్నది.

జి. *చాముండ:*—ఈమె చతుర్భుజ. అందు త్రిశూలము, ఫలము, డమరుకము, అభయముద్ర ధరించియున్నది. కపాలములతో కూర్చిన ఉపవీతము (యజ్ఞోపవీతము) కలిగియున్నది. నక్క వాహనము పీఠము మీద చెక్కియున్నది.

*గణేశుడు:*—గణపతి చతుర్భుజుడు. అంకుశము, మోదకములు, దంతము, తావలము ధరించియున్నాడు. కరండమకుటధారి, సర్పఉదర బంధము, మిగిలిన ఆభరణములు ధరించియున్నాడు.

సప్తమాతృకలు, గణపతి, వీరభద్రుడు అందరూ ఒకే భద్రపీఠము మీద కూర్చొనియున్నారు. అందరకూ అర్ధచంద్రాకారపు ప్రభామండలములు కలవు. అందరికీ కంకణకేయూరములు, మేఖలము, ఉరుమాల, కారండమకుటము కలవు. కాశె బిగించిన వస్త్రధారణ కలిగియున్నారు. "త్రివళి" బాగా కనిపించుచున్నది.[1] ఇది చాళుక్య శిల్పము. క్రీ.శ. 11–12 శతాబ్దము.

**21.** *భద్రకాళి:*—(మహాకాళి) అర్ధచంద్రాకారపు ఫలకమందు చెక్కిన శిల్పము. చతుర్భుజ. పైచేతులందు డమరుకము, త్రిశూలము, క్రింది ఎడమచేయి యందు అభయముద్రకలదు. నాలుగవచేయి విరిగిపోయినది. విగ్రహపు ఎడమ భాగమున నందివాహనము చెక్కియున్నది. కుడిభాగమందు వినాయకుడు కలడు. కాశెబిగించిన వస్త్రము, పట్టుదట్టీ, దాని పటకము ముందు వ్రేళ్ళాడుచూ కలదు.

**22.** *నాగశిల్పము:*—నాగునకు నడుము క్రిందిభాగము సర్పరూపము పైభాగము మానవరూపము రెండు చేతులందు కత్తి, డాలు ధరించియున్నాడు. మణిమయ కిరీటము, అనేక హారములు కలిగియున్నాడు. ఇరువైపుల ఒక నాగు నిలిచి పడగతో గౌరవముగా నీడనిచ్చుచున్నది క్రీ.శ. 12 శతాబ్దము.

**23.** *వీరకల్లు:*—దీర్ఘచతురస్రాకారపు రాతిఫలకములో మలచిన శిల్ప మిది. ఇది రెండుభాగములుగా ఉన్నది. మొదటి భాగములో ఒక గుఱ్ఱపు రౌతు ఈటెను ధరించియున్నటులున్నది. రెండవభాగములో ప్రేయసీ ప్రియులు గుఱ్ఱము మీద స్వారీ అయి పోవుచున్నారు. గొడుగులాంటిది ఒకటి వారికి ఆచ్ఛాదన కలదు. గుఱ్ఱము బాగుగా అలంకరించియున్నది. మొదటి రౌతు పార్శ్వాకారము **(Profile)** నందు కలదు. క్రీ.శ. 12 శతాబ్దము.

**24.** *పార్వతి:*—ఇది ఒక ఊర్ధ్వాంగ ప్రతిమ (Bust). అనగా నడుముకు క్రింది భాగము విరిగియున్నది. చేతులు కూడా విరిగిపోయినవి. దేవి కరండ మకుటధారిణి. సర్వాభరణములు ధరించియున్నది. క్రీ.శ. 12 శతాబ్దము.

**25.** *ఫలకము:*—రాతిఫలకము కొంతమేర విరిగిపోయినది. సోమేశ్వర స్వామి మధ్యను కలడు. స్వామివారికి మూడు తలలు, నాలుగు చేతులు. అందు

---

1. పశ్చిమ చాళుక్య సాంప్రదాయములో అన్ని జైనమూర్తులందు త్రివళి కని పించును. ఇది క్రీ. శ. 11-13 శతాబ్దము వరకూ తరచు యుండెడిది. త్రివాళి యనగా, బొడ్డు పై భాగమున ఉండు మూడు ముడుతలను రేఖామాత్రముగా చూపుట.

అభయముద్ర, సర్పము, కమండలము (?) త్రిశూలము కలవు. సోమేశ్వరుని కుడి పార్శ్వమందు విష్ణుమూర్తి కలడు. ఆయన మొదటి రెండు చేతుల అంజలి మోడ్చియున్నాడు. పై రెండు చేతులందు శంఖము, చక్రము, ధరించియున్నాడు. మణిమయ కిరీట ధారి. ఇది పార్శ్వాకారమునకలదు (In Profile). విష్ణుమూర్తి వాహనము గరుడుడు. అళిదాసనమందు పీఠముమీద చెక్కబడియున్నాడు. ఇది బాగా పురాతనమైనదిగా కనిపించుచున్నది. క్రీ.శ. 8 శతాబ్దమునకు చెందియుండవచ్చును.

***26.*** ***ఫలకము:***—ఈ ఫలకమందు చెక్కిన శిల్పమును నిర్ణయించుట కొంచెము కష్టము. ఇతను దండమును ధరించినను, దాని చివర పానవట్టపు ఆకారము కలదు. మిగిలినచేతులందు కలశము, పాశము, అభయముద్ర కలదు. గడ్డము, జటామకుటము కలవు. కీర్తిముఖపతకము కలిగినమేఖలము ధరించి యున్నాడు. ముత్యాలహారములు, కంకణములు, మొగలుగాగల ఆభరణములను ధరించియున్నాడు. బహుశః ఈ ప్రతిమను బ్రహ్మగా గుర్తించవచ్చును. క్రీ.శ. 13 శతాబ్దము.

***27.*** ***కోష్ఠపంజరము:***—ఇది మూడు అంతస్తుల శిఖరముకలది. మొదటి అంతస్తునందు ఉమామహేశ్వర విగ్రహము చెక్కబడియున్నది. ఉమామహేశ్వరుడు చతుర్భుజుడు, సుందరమైన రూపుకలవాడు, రజోగుణమూర్తి. ఇతను భద్రపీఠము మీద ఆసీనుడై ఎడమకాలు మడిచి పీఠముమీద పెట్టి కుడికాలు క్రిందకు వ్రేళ్లాడు చుండునట్లుండును. జటామకుటధారి. కంకణ కేయూరములు, యజ్ఞోపవీతము కలిగి యుండును. శివునివామపార్శ్వమున పార్వతీదేవి (ఉమ) యుండును. ఈమె కరండమకుట ధారిణి. ఎడమచేతియందు ఉత్పలమును ధరించి యుండును. (శివుడు నాలుగు చేతులందు అభయ, సింహకర్ణము, మృగము, పరశువు, గలిగి యుండును) ఇది క్రీ.శ. 11–12 శతాబ్దము నాటిది. (చిత్రము - 6)

***28.*** ***సూర్యుడు:***—ఇది మొండి విగ్రహము (తలవిరిగి పోయినది). సమపద స్థానక మందు కలదు. రెండుచేతులందు సగము వికసించిన పద్మములను భుజముల వరకూ వచ్చువిధముగా ధరించియున్నాడు. ధోవతి, దానికి కటి బంధముకలవు. ఉదర బంధము కలదు. దాక్షిణాత్య సాంప్రదాయము ప్రకారము కాళ్ళకు మొనతేలిన పాదరక్షలు (Boots) లేవు.[1] క్రీ.శ. 12–13. శతాబ్దము.

***29.*** ***నాగిని:***—సగము మానవరూపము, సగము సర్పరూపము కలదు. కత్తి, డాలు ధరించియున్నది. ఒకేసరముగల హారముధరించి, కంకణ కేయూరములు

1. దాక్షిణాత్య శిల్పములందు తప్ప మిగతా భారత దేశమందలి సూర్యుని శిల్పము లన్నీ మొనదేలిన పాదరక్షలను ధరించియుండును. పద్మములు గూడా చాలా మటుకు బాగా వికసించినవిగా చేతులందు ధరించినటులుండును.

మేఖలము ధరించియున్నది. కరండమకుట ధారిణి. రెండు సర్పములు, నిలువుగా రెండు ప్రక్కల నిలబడియున్నవి.

*30. శివలింగము*

*31, 32. ద్వారపాలురు:*—సోమేశ్వరస్వామి వారి దేవళము ముందర కల ద్వారపాలురు కొంచెముగా వంగి వారి చేతిగదల మీద ఆనినటులున్నారు. కోరమీసములు, మిడిగుడ్లు, కలిగియున్నారు. ఇది చాళుక్యశిల్పము. క్రీ.శ. 11-12 శతాబ్దము నాటిది.

*33. వజ్రపాణి:*—బౌద్ధమత మండలి దేవతయగు వజ్రపాణి విగ్రహము. బౌద్ధాగమము ననుసరించి వజ్రపాణి రెండుచేతులుకలిగి కుడిచేతియందు వజ్రము (చిరుతలాంటిది) ఎడమ చేతియందు కర్ణముద్రను కలిగియుండును. కపాలమాలను శిరస్సున ధరించియుండును. మెడలోకూడ కపాలమాలను మెలితిరిగిన పామును హారములుగా కలిగియుండును. వజ్రపాణి నిలుచుని కపాలముమీద నృత్యము చేయుచుండును. కాని ఈ విగ్రహము నడుము క్రిందిభాగము విరిగిపోయినందున ఎటులున్నదీ తెలియదు. (చిత్రము - 12)

వజ్రపాణి భయంకరరూపము కలిగినవాడు. ఇతను బౌద్ధమత మండలి తాంత్రికశక్తులకు సంబంధించిన సూత్రకారుడందురు. ఇతను బౌద్ధులకు శక్తి ప్రదాతయని ప్రతీతి. క్రీ.శ. 13 శతాబ్దము,

*34. కార్తికేయుడు:*—కుడిచేతియందు శక్తిని ధరించిన శిల్పమిది. ఎడమ పార్శ్వమున కార్తికేయునిభార్య వల్లీదేవి అతని కళ్ళలోనికి చూచుచున్నది. కుడి వైపు పీఠముమీద అతని వాహనము నెమలి కలదు. వల్లీదేవి వస్త్రము ఆమె పిక్కల వరకూవచ్చియున్నది. కేశములు ధమ్మిల్లములోనున్నవి. కార్తికేయునికి మణిమయ కిరీటము కలదు. ఇతనికి ఒకశిరస్సు, త్రినేత్రుడు.

*35. మహిషాసురమర్దని:*—ఇది త్రిభంగ మందు మలచిన అందమైన మహిషాసురమర్దని విగ్రహము. రూపు కొంచెము చెడియున్నది గాని అందము చెడ లేదు. మహిషముతల వేరుచేయగా, దాని దేహమునుంచి రాక్షసుడు మానవా కారముతో అంజలి ఘటించివచ్చుచున్నాడు. అమ్మవారికి ఎనిమిది చేతులు. మొదటి రెండు చేతులతో మహిషాసురుని పట్టుకొనియున్నది. మిగిలిన హస్తములందు ఖడ్గము, బాణము, త్రిశూలము, ఎడమ చేతులందు పాశము, చక్రము ధరించెను, ఒక చేయి విరిగిపోయియున్నది. బహుశః అందు శంఖము ధరించియుండును. చాళుక్య శైలిలో సర్వాభరణములు ధరించియున్నది. క్రీ.శ. 11-12 శతాబ్దము.

*36.* **ఉమామహేశ్వరులు:**—ఒక ఫలకమునందు శివపార్వతులు భద్రపీఠము మీద సుఖాసీనులై యున్నారు. నందివాహనము పీఠముమీద చెక్కబడియున్నది. శివునికి జటామకుటము, యజ్ఞోపవీతము కలవు. వామపార్శ్వమున పార్వతికలదు. ఈమెకు రెండుచేతులు. కుడిచేతియందు పద్మము, ఎడమచేయి సింహాకర్ణమునందు కలదు. ఈమె కరండమకుట ధారిణి. ఈమె సర్వాభరణభూషిత అయి, శివుని భుజముల వరకూ వచ్చియున్నది.

*37.* **సూర్యుడు:**—కమల బాంధవుడు. తన రెండుచేతులందు సగమువికసించిన పద్మములను ధరించియున్నాడు. అవి అతని భుజములవరకూ వచ్చియున్నవి. ఉదరబంధముకలదు. పాదములకు పాదరక్షలులేవు.

*38.* **కుబేరుడు:**—ఇతను ధనపతి. ధనపతి యక్షవంశపు రాజు. కనుక అందరు యక్షులవలె కుంభోదరుడు (కుండపొట్టకలవాడుగా చూపబడెను). చతుర్భుజుడు. అన్ని ఆభరణములనూ ధరించియున్నాడు. ఉదరబంధము, మణిమయ కిరీటము కలిగియున్నాడు. అతని కుడిచేతియందు పుష్పము (పద్మము) కలదు.

*39.* **ఆలింగన చంద్రశేఖరమూర్తి:**—ఈ రాతిఫలకమునందు పార్వతీ పరమేశ్వరులు నిల్చొనియున్నారు. శివుడు తన వామహస్తముతో పార్వతిని ఆలింగనము చేసుకొనియున్నట్లు చూపబడెను (భుజముమీద చేయి వేసియున్నాడు). కుడిచెయ్యి తన నడుము మీద పెట్టుకొనియున్నాడు. శివుని శిరస్సున జటాజూటము కలదు. ఇరువురు ముఖములు చెడిపోయియున్నవి. పార్వతి తలవెంట్రుకలు ధమ్మిల్లముగా అమరియున్నవి. ఆమెవస్త్రము బాగా పొడవుగా పాదములను తాకుచూ ఉన్నది. సర్వాభరణ భూషిత.

శివుడు చతుర్భుజుడు. అతని చేతులందు కుడివైపునుంచి అభయహస్తము, త్రిశూలము, సర్పము (తావళము) ధరించి, నాలుగవ చేతితో ఆలింగనము చేసుకొని యున్నట్లు కలదు (నాలుగవచేయి పార్వతి భుజముమీద వేసియున్నది). పార్వతి వామహస్తమున నీలోత్పలము ధరించి, కుడిచేతిని నడుముమీదపెట్టుకొని త్రిభంగిమమందు నిలిచి యున్నది.[1] చాళుక్య శిల్పము. క్రీ.శ. 11 శతాబ్దము.

*40.* **చాముండ:**—సప్తమాతృకలలో ఒక మాతృక చాముండ. ఈమె చతుర్భుజములు కలిగి అందు త్రిశూలము, కలశము, ఖడ్గము, డమరుకము, ధరించి యున్నది. మామూలుగానుండు ఎముకలపోగు ఆకారముగాక ఈమె దృఢముగా ఉన్నది. మామూలు ఆభరణములు (చాళుక్యశైలివి) ధరించియున్నది. క్రీ.శ. 12 శతాబ్దము. (చిత్రము - 7)

---

1. పార్వతి తన కుడి పాదమును శివుని పాదముల మీద మోపి, కుడిచేతిని శివుని నడుము దగ్గర పెట్టి ఆలింగనము చేసుకొనవలయును.

*41.* విష్ణువు:—ఇది చాలా అందమైన విష్ణువు విగ్రహము. స్వామివారు చతుర్భుజుడు. చేతులందు పద్మము, శంఖము, చక్రము, గద కలిగియున్నాడు. చతుర్వింశతి మూర్తులందలి "గోవిందుని" రూపమిది. ఇరువురు చామరగ్రాహిణులు ఇరువైపుల కలరు. క్రీ.శ. 12శతాబ్దము. (చిత్రము - 8)

*42.* సరస్వతి:—చదువులదేవి సరస్వతి. పద్మపీఠముమీద పద్మాసనాసీన అయియున్నది. మూడు యాళిమృగములు భద్రపీఠముమీద చెక్కియున్నవి. క్రీ.శ. 12 శతాబ్దము.

*43.* విష్ణువు:—సమపదస్థానకము నందలి విష్ణువిగ్రహమిది. చతుర్భుజుడు. అందు శంఖచక్రగదా పద్మములుకలిగియున్నాడు. చాళుక్యలక్షణములు కల ఈ మూర్తి, చతుర్వింశతి మూర్తులందలి "కేశవమూర్తి" రూపముగానగును. కటిబంధము, కంకణ కేయూరములు, ముత్యాలహారములు, కర్ణాభరణములు కలిగియున్నాడు. కిరీటము చెడిపోయియున్నది. కిరీటమకుటము కానోపు, పాదముల తాకు ధోవతి, దానికి ముందు విపులముగా గల పటకము అందముగా ఉన్నది.

*44.* కోదండరాముడు:—విష్ణువుయొక్క దశావతారములందు శ్రీరామావతారమునకు ప్రత్యేకత కలదు. ఇతను సంపూర్ణ మానవుడని విజ్ఞుల అభిప్రాయము. ఇతను సామాన్యముగా త్రిభంగమందు కోదండము ధరించి సీతాలక్ష్మణ సమేతుడై యుండును. కాని ఇచ్చట కోదండరాముడు సమపద స్థానక మూర్తి. కుడిచేతియందు బాణము, ఎడమచేతియందు ధనుస్సు ధరించియున్నాడు. వస్త్రధారణ, ఆభరణములు విజయనగర శైలియందు కలవు. కిరీటమకుట ధారి. క్రీ.శ. 16 శతాబ్దము (చిత్రము - 9).

*45.* బ్రహ్మ:—చతురస్రాకారపు రాతిఫలకము. బ్రహ్మ పద్మపీఠముమీద నిలచియున్నాడు. కొంత విరిగిపోయియున్నది. చతుర్భుజుడు. మొదటి రెండు చేతులు అంజలి ఘటించియున్నవి. పై రెండు చేతులందు ఆజ్యస్థాలి (నేతికలశము) తావలము కలవు. ఇతనికి మూడు తలలు కలవు (నాలుగవది వెనుకయున్నటుల గ్రహింపవలయును). ఈ నాలుగు ముఖములు నాలుగు వేదముల సూచించును. వాటిని మణిమయ కిరీటము లలంకరించియున్నవి. (జటామకుటము యుండుట కూడ కలదు). హంస వాహనము పీఠముమీద కలదు. కటిసూత్రము, యజ్ఞోపవీతము మొదలగు ఆభరణములు దేహము నలంకరించి యున్నవి. శివునిదో లేక సావిత్రిదో ఒక చేయి శూలమును ధరించియున్నది, కాని విగ్రహము విరిగిపోయినది. పశ్చిమ చాళుక్య విగ్రహము. క్రీ.శ. 12 శతాబ్దము.

*46.* శివుడు:—జటాజూటధారి అయిన పరమశివుని రూపమిది. బాగా రూపు చెడియున్నది. శివుడు చతుర్భుజుడు. కాని ఒక చేతియందు గద, మరొక చేతి యందు తావలము మాత్రము కనిపించుచున్నవి. మిగిలినచేతులు విరిగిపోయినవి. బహుశః ఇది పాశుపతమూర్తి అయియుండవచ్చును. క్రీ.శ. 11 శతాబ్దము.

*47.* పరశురాముడు:—విష్ణువుయొక్క దశావతారములందు పరశురాముని గూడా చేర్చుట కలదు. ఇతనికి జటాజూటము, మునిరూపు కలవు. కుడిచేతియందు పరశువు (గండ్రగొడ్డలి), ఎడమచేయి సూచీ హస్తముకలవాడు. మోకాళ్ళు దిగని ధోవతి ఇతని వస్త్రధారణము. క్రీ.శ. 16 శతాబ్దము.

*48,49.* ద్వారపాలురు. (శిల్పం 31 మరియు 32 చూడుడు).

*50.* నంది:—అద్దంలాగ మెరుగుపెట్టబడిన నల్లరాయియందు మలచిన కాకతీయ నందివిగ్రహమిది. విగ్రహస్వరూపముతో పోల్చిన దానికి చేసిన ఆభరణ సంపద కొద్దిఎక్కువనిపించును. ముత్యాలహారములు, బాగా ఉబికివచ్చి నటుల స్థిరముగా కనిపించుచున్నవి. అన్నిలక్షణములు పరిపూర్తిగా రూపొందించబడ్డ ఈ విగ్రహము, కాకతీయశిల్పకళానైపుణికొక ఆణిముత్యమనిపించును. ముఖమునకు మువ్వలపట్టీ, అనేక ఇతర హారములు, కీర్తిముఖపు కుచ్చులు, మువ్వలహారము, అన్నీకలిపికట్టి వీపుమీద బ్రహ్మముడికి కలిపి చాలా అందముగా ఉన్నది. మెడలోని గజ్జలహారము అపురూపము. వీటన్నింటితో ఈ నంది తీర్చి దిద్దినటులున్నది. కాకతీయ, క్రీ.శ. 3 శతాబ్దము. (చిత్రము - 10)

*51.* శిలాఫలకము:—దీర్ఘచతురస్రాకారపు ఫలకము. రెండుభాగములుగా విభజించబడినవి. పైభాగమునందు ఒక భక్తుడు శివలింగమును పూజించుచున్నాడు. రెండవ భాగమందు ఒక వీరుడుకలడు. రాతిఫలకమునకు నాలుగువైపుల వెడల్పైన అంచుకలదు. అంచుమీద క్రీ.శ. 10 శతాబ్దపు శాసనము కలదు. దానిని గ్రహించుట కష్టము. రెండవభాగమందలి వీరుడు ఈటెను ధరించి (ఎడమ చేతియందు) కుడి చేతియందు కత్తిని ధరించి యుద్ధము చేయుటకు సిద్ధముగానున్నాడు. ఆతనుయుద్ధము చేయుచున్నాడనుటకు నిదర్శనముగా అతనికాళ్ళదగ్గర యిద్దరు మృతవీరులు పడియున్నారు.

*52.* మహావీరుడు:—జైనతీర్థంకరులలో ఇరువదినాలుగవవాడైన వర్ధమాన మహావీరుని విగ్రహమిది. ఇతను పద్మాసనాసీనుడై యోగముద్రయందున్నాడు. ఇతని తలమాత్రం ప్రస్తుతం మృగ్యం. ఇది బాగా మెరుగుపెట్టబడి నల్లనికాంతులీను చున్నది. క్రీ.శ. 11-12 శతాబ్దము. (చిత్రము - 11)

# కొలనుపాక—శాసనములు

1. ఇద్దరు రాజులచేత ఇవ్వబడిన శాసనమిది. కళ్యాణి చాళుక్య వంశమునకు చెందిన త్రిభువనమల్ల దేవుడు (క్రీ. శ. 1076–1127), శ్రీ జగదేకమల్లుడు (క్రీ. శ 1015–1042) ఇచ్చిన దానశాసనమిది. ఇందు వీరిరువురు, జైన మతాచార్యుడైన చంద్రసేనాచార్యునకు కొంతభూమిని దానముగా నిచ్చినటుల తెలుపుచున్నది శ్రీ చంద్రసేనాచార్యులవారు బహుశః కొలనుపాకయందలి జైన దేవళమునకు ఆచార్యుడై యుండవలయును.

2. ఇది ఆరవ విక్రమాదిత్యుని క్రీ. శ. 1099 కాలమునాటి శాసనము విక్రమాదిత్యుని 22 వ రాజ్య సంవత్సరమున చేయబడిన ఒక దానశాసనము.

3. మూడవ తైలపుడు (కీ. శ. 1151–1156) చాళుక్యవంశజుడు ఇచ్చిన శాసనము.

4. రెండవ తైలపుడు (క్రీ. శ. 990) నాటిశాసనము.

5. త్రిభువనమల్ల దేవుని శాసనము. (క్రీ. శ. 1076–1127) కన్నడలిపియందు కలదు. ఈ శాసనమునందు కుమారసోమేశ్వరుని వివిధబిరుదులను అభివర్ణించి అతను కొంతభూమిని సోమేశ్వరస్వామివారికి దానముచేసినటుల తెలుపుచున్నది.

6. కళ్యాణి చాళుక్యుల కాలమునాటి సంస్కృత శాసనము.

7. త్రిభువనమల్ల దేవుడు (క్రీ. శ 1076–1127) (చాళుక్యవంశజుడు) కొన్ని పన్నులవలన వచ్చు రాబడిని కొలనుపాక యందలి ఒక రెడ్డికి దానముచేసినటుల తెలుపుచున్నది.

8, 9. తైలపుడు (క్రీ. శ. 973–997) ఇచ్చిన ఒక దానశాసనము.

10. త్రిభువనమల్లుని (క్రీ. శ. 1076–1127) యొక్క మరియొక దానశాసనము

11. కాకతీయరుద్రదేవుని సంస్కృత శాసనము. కాకతీయరుద్రదేవుని భృత్యుడొకడు కొల్లిపాకయందలి స్వయంభూ మాణిక్యతీర్థులవారికి నిత్యము రెండు పూటల జరుగవలసిన ధూప, దీప, నైవేద్యముల కగు ఖర్చునిమిత్తమై ఇచ్చిన దానమును సూచించుచున్నది.

12. కాకతీయ గణపతిదేవుని తెలుగు లిపియందు కల శాసనమొకటి సోమేశ్వర స్వామివారి దేవాలయ ప్రాకారమందు కల చండికాంబ దేవత యొక్క గర్భగుడి కెదురుగా కలదు. ఇది అసంపూర్తి శాసనము. ఇందు కాకతీయరుద్రదేవుని "అనుమకొండపురవరు"డని తెలుపుచున్నది. అదికాక రుద్రదేవుని భృత్యుడొకడు (వాని పేరు కనిపించలేదు) కొంతభూమిని ఇచ్చట దేవునకు దానముగా నిచ్చినటులున్నది.

13. సోమేశ్వరస్వామి వారి దేవాలయ ప్రాంగణమందలి నూతిగట్టులో త్రైలోక్యమల్లదేవుని శాసనమొకటి కలదు. ఇది కన్నడలిపిలో నున్నది. ఇది అసంపూర్తిశాసనము. ఇందు చాళుక్యవంశ ప్రశస్తి "మానవ్యసగోత్రోద్భవశ్య" అని మొదలిడి, త్రైలోక్యమల్లదేవుని బిరుదులనన్నింటిని అభివర్ణించుచున్నది.

14. సోమేశ్వరస్వామివారి దేవాలయము దగ్గరలోనున్న కోనేటి గట్టునగల పెద్దబండరాయిమీద శాసనము. ఇందు వేల్పుగొండడు - కవనయ్య యని ఇద్దరి పేర్లను ఉదహరించుచున్నది.

15. సోమేశ్వరస్వామివారి దేవాలయములో గల నందివిగ్రహము కల స్తంభము మీద శాసనము "అల్లడిమల్లయ్య" యను పేరు నుదహరించుచున్నది. బహుశః ఇతను ఈ దేవాలయ నిర్మాణమందు పనిచేసిన ఒకస్థపతి అయియుండవచ్చును.

16. సోమేశ్వరస్వామివారి దేవాలయమంటపమందు ఒకపెద్దరాతితొట్టికలదు. దానిమీద ఒకపేరు సూచించబడినది. ఇది ప్రస్తుతవ్యవహారిక భాషయందున్నది. ఇందు రవిచెడి ధర్మయ్య యొక్క పుత్రులు ఈ తొట్టిని తయారుచేయించి స్వామివారికి దానమిచ్చిరని వ్రాయబడెను.

---

# తు ది ప లు కు

మానవుని విజ్ఞాన సముపార్జనమందు మ్యూజియంలయొక్క ముఖ్యపాత్రను గురించిన చైతన్యము ఇప్పుడే మనదేశములో కలుగుచున్నది. ప్రజలందు విద్యావ్యాప్తిని మ్యూజియంలద్వారా కూడా కలిగించవచ్చునని వైజ్ఞానికంగా పురోభివృద్ధి చెందినదేశములందు చాలా కాలం క్రిందమే అవగతమైననూ మనదేశమునందది ఇప్పుడిప్పుడే జరుగుచున్నది. ఇటువంటి చైతన్యము "కొలనుపాక మ్యూజియం" వంటి ప్రాదేశిక ప్రదర్శనాలయములద్వారా ఇతోధికముగా జరుగుననుట నిర్వివాదాంశము. దేవాలయ ప్రాంగణములందు నెలకొల్పబడిన మ్యూజియంలలో కొలనుపాక ఒకటి. అచ్చటికి ఆ గ్రామప్రజలు, చుట్టుప్రక్కల గ్రామములవారే కాక దేశము నలుమూలలనుంచీ యాత్రికులు వచ్చి చూచుచున్నారు.

ఈ మ్యూజియమును దర్శించు ప్రజలు అక్కడ ఒక మ్యూజియం, అచ్చట విలువైన అనేక వస్తువులు జాగ్రత్తగా కాపాడబడుచున్నవని, వాటినిగురించిన విశేషములను తెలుపుచున్నారని చూచుటకు కాక, అచ్చట తమ మనసు కెక్కిన ఒక దేవాలయము, అందు తన ఇష్టదైవము కలవని, వాటిని సేవింతమన్న సదుద్దేశముతో కూడ వచ్చుచున్నారు. ఈ విధముగా వచ్చిన ప్రజానీకము తమ కందుబాటులో నిక్షిప్తపరుచబడిన విజ్ఞానమును, శిల్పసాంప్రదాయ విశేషములనూ, ఇంకా అనేక విషయములను గ్రహించి ఆనందించుట ద్వారా ఈ మ్యూజియం నిర్మాణ ముఖ్యోద్దేశము అన్నివిధముల సిద్ధించినదని చెప్పవచ్చును.

ప్రతి మ్యూజియంయొక్క ముఖ్యోద్దేశము ప్రజాసేవ. ప్రజలందనేక తరగతులవారు (విజ్ఞానము, చదువువయస్సులందు) యుందురు. ఇటువంటి విభిన్న వర్గముల పౌరులకు, వారి ఆశయాలను దృష్టియందుంచుకొని వారి వారి కోరికల కనుగుణముగా మన ప్రదర్శన నేర్పాటుచేయవలయును.

కొలనుపాక మ్యూజియం శిల్పవిశేషములగురించి చర్చించుట కనువైన ప్రదేశము. ఈ మ్యూజియములో చాళుక్య కాలమునాటి సోమేశ్వరస్వామి వారి దేవాలయమందు కలదు. ఇచ్చటి శిల్పములుకూడా ముఖ్యముగా చాళుక్య కాకతీయుల నాటివి. కనుక చరిత్ర పరిశోధకులకు, విద్యార్థులకు ఇచ్చట విస్తారమైన వస్తుసముదాయము కలదు. కాకతీయ చాళుక్య శైలిరీతులు, అందలి ఏకత్వ భిన్నత్వములగురించి తెలుసుకొనుటకుఇంతకంటే అనువైన ప్రదేశములేదు. అటులనే శాసనములమీద పరిశోధించువారికి కూడ అనేక శిలాశాసనము లిందుకలవు.

విద్యార్థులకు, పరిశోధకులకు, సాధారణ ప్రజలకు, కళాభిలాషులకు, ప్రతి ఒక్కరికి ఇచ్చట మనస్సుకు తృప్తి కలుగును.

---

చిత్రము-1



కొలనుపాక ప్రదర్శనశాల దృశ్యము



గణపతి
(క్రీ. శ. 12 వ శతాబ్దము)



వీరకల్లు
(క్రీ. శ. 12 వ శతాబ్దము)



మహిషాసురమర్దని
(క్రీ. శ. 12వ శతాబ్దము)



కోష్ఠపంజరముపై ఉమామహేశ్వరులు
(క్రీ. శ. 12 వ శతాబ్దము)



చాముండి
(క్రీ. శ. 13వ శతాబ్దము)



కోదండరాముడు
(క్రీ. శ. 12 వ శతాబ్దము)

చిత్రము-10




నంది

(క్రీ. శ. 13 వ శతాబ్దము)



మహావీరుడు
(క్రీ. శ. 13 వ శతాబ్దము)



త్రిభువన మల్లుని మాన స్తంభము
(క్రీ. శ. 1076-1127)